# చెప్పుకోండి చూద్దాం

తీయ తీయని స్వీటును
తీయని నీటిలో చేపను
బంతిలాంటిది నా ఆకారం
నోటపడితే క్షణంలో మాయం

గోడలమీదా వేలాడుతుంటా
ఆడవారి పర్సుల్లో దూరుతుంటా
మీకు మిమ్మల్నే చూపిస్తుంటా
ఉన్న నిజం చెప్పేస్తుంటా

డా.ఎం.హరి కిషన్ - కర్నూలు

# చెప్పుకోండి చూద్దాం

మేఘం నుండి దూకేస్తా
చేలను ఊళ్ళను తడిపేస్తా
చెరువులు దొరువులు నింపేస్తా
నేలను పచ్చగ మార్చేస్తా

పొదలు పొదలుగా పెరుగుతాం
పొడవు పొడవుగా ఎదుగుతాం
మా రూపం మేదరి మార్చేస్తే
మీ ఇళ్ళకు సైతం వస్తుంటాం

డా.ఎం.హరి కిషన్ - కర్నూలు

# చెప్పుకోండి చూద్దాం

పచ్చరంగూ చిన్నోన్ని
ఎర్రరంగూ ముసలోన్ని
నేనెక్కువైతే నోరంత మంట
నేలేకుంటే పూర్తి కాదు వంట

తూరుపు దిక్కున ఉదయించి
లోకములన్నీ చూస్తాడు
వేడీ వెలుతురు పంచిచ్చి
పడమటి దిక్కున శయనిస్తాడు

డా.ఎం.హరి కిషన్ - కర్నూలు

# చెప్పుకోండి చూద్దాం

మెడలో మాల

శిరమున పింఛం

కరమున మురళి

నల్లని దేహం

రాజుకు కొడుకుగా పుట్టాడు

రాజ్యాన్ని వదిలి వెళ్ళాడు

ధ్యానం చేసి జ్ఞానం పొంది

శాంతి అహింసలు బోధించాడు

డా.ఎం.హరి కిషన్ - కర్నూలు

# చెప్పుకోండి చూద్దాం

తండ్రిమాటను తలదాల్చి
అరణ్యవాసం చేశాడు
రావణబ్రహ్మను హతమార్చి
సీతను పరిగ్రహించాడు

మన దేశానికి ఉత్తరాన
ఉన్న మంచు పర్వతం
జీవనదులు ఎన్నిటికో
జన్మనిచ్చిన పర్వతం

# చెప్పుకోండి చూద్దాం

చేత ఆయుధం లేకున్నా
కీచకుని పీచమడచె
వేయి ఏనుగుల బలమున్నా
విరటుని ఇంట వంటలు చేసె

విలువిద్యలో ప్రథముడు
పాండవులలో మధ్యముడు
ఇతని విల్లు గాండీవం
కాల్చెను ఇతడు ఖాండవవనం

డా.ఎం.హరి కిషన్ - కర్నూలు

# చెప్పుకోండి చూద్దాం

ఒంటినిండ చారలు

వాడివాడి కోరలు

గాండ్రు గాండ్రు అరుపులు

వేటతోటి విందులు

భారతరత్న ఈ వనిత

నోబెల్ బహుమతి గ్రహీత

రోగుల సేవలో ఈమె పునీత

అనాథల పాలిట దేవత

డా.ఎం.హరి కిషన్ - కర్నూలు

# చెప్పుకోండి చూద్దాం

జిత్తులమారి జంతువట
రాత్రి ఊళలు వేయునట
ఒంటినిండా జూలట
అడవిలోనా వుండునట

మూతి చూడ పిల్లిమూతి
తోక చూడ నక్కతోక
పాములకిది శత్రువు
బొరియల నుండు జంతువు

డా.ఎం.హరి కిషన్ - కర్నూలు

# చెప్పుకోండి చూద్దాం

ప్రాణంలేని పాము
వేలమైళ్ళు సాగుతుంది.
ఎర్రరంగు చూస్తే
కీచుమని ఆగుతుంది.
పచ్చరంగు చూస్తే
కూ అని సాగుతుంది.

పిడికెడంత పిచ్చుకంట
పాటపాడి పిలుచునంట
గుప్పిట్లో ఒదుగునంట
కబుర్లెన్నో చెప్పునంట
జేబులోన ఇముడునంట

డా.ఎం.హరి కిషన్ - కర్నూలు

# చెప్పుకోండి చూద్దాం

నీటి నుంచి వచ్చు
నీటబడితే చచ్చు
వంటవార్పుకొచ్చు
వంటకు రుచినిచ్చు

గీగీ రాగం
గిరికీల నాట్యం
తాగును రక్తం
తెచ్చును రోగం

డా.ఎం.హరి కిషన్ - కర్నూలు

# చెప్పుకోండి చూద్దాం

చెట్టు చెట్టు వెదుకుతుంది
పువ్వు పువ్వునడుగుతుంది
తేనెచుక్కలు తెస్తుంది
గూటిలోన దాస్తుంది.

రూపంలేని చెట్టుకు
పన్నెండు కొమ్మలు
కొమ్మకొమ్మకూ నాలుగుపండ్లు
పండుపండుకూ ఏడుగింజలు

డా.ఎం.హరి కిషన్ - కర్నూలు

# చెప్పుకోండి చూద్దాం

జైజవాన్ జైకిసాన్ అన్నాడు
పొట్టివాడైనా గట్టివాడనిపించాడు
పేరులో వుంది బహదూర్
ఆయనంటే శత్రువులకు బలాదూర్

స్వరాజ్యం నా జన్మహక్కని
గర్జించిన ఘనుడెవ్వడు
లోకమాన్యుడై విలసిల్లిన
ఆ మాన్యచరితుడెవ్వడు

డా.ఎం.హరి కిషన్ - కర్నూలు

# చెప్పుకోండి చూద్దాం

జాతిని ఏకం చేసిన గేయం
దేశభక్తి ప్రేరేపించిన గేయం
పాఠశాలలో పాడే గేయం
బకించంద్రుని ప్రసిద్ధ గేయం

దమ్ముంటే కాల్చుకోండని
రొమ్ము చూపిన యోధుడెవ్వడు
ఆంధ్రరాష్ట్రమునేలినట్టి
ఆంధ్రకేసరి ఎవ్వడు?

డా.ఎం.హరి కిషన్ - కర్నూలు

# చెప్పుకోండి చూద్దాం

రాజ్యాంగాన్ని రూపొందించాడు
దళితుల కోసం పరితపించాడు
ప్రజలందరినీ మెప్పించాడు
బాబాసాహెబ్ అనిపించాడు

భూదానోద్యమ సారథిగా
భూమిని భిక్షగా అడిగాడు
భూస్వాములను యాచించి
భూములు పేదలకిప్పించాడు

డా.ఎం.హరి కిషన్ - కర్నూలు

# చెప్పుకోండి చూద్దాం

జాతీయ గీతం రాశాడు

నోబెల్ బహుమతి సాధించాడు

శాంతినికేతన్ స్థాపించాడు

గీతాంజలినే అందించాడు

ఎవరీ విశ్వకవీంద్రుడు

ఎదపై ఎర్రగులాబీ

తలపై ఖద్దరుటోపీ

బాలలకంతా చాచాజీ

ఎవరో చెప్పవె బుజ్జాయి

డా.ఎం.హరి కిషన్ - కర్నూలు

